

అతిమధురముగా స్రవిస్తున్నది, కంఠములోనుంచి స్వాములవారూ! వినండి!

౨౧-వ పుట.

# భగవదజ్జుకము

## ప్రహసనము

బోధాయన కృతికి తెనుఁగు



గ్రంథకర్త
వేటూరి ప్రభాకర శాస్త్రి

ప్రకాశకుడు
వేటూరి శంకర శాస్త్రి

# తోడిమ

భగవదజ్జుకప్రహసనపుష్పమున పరిమళము గొనువారీతోడిమతో దానిఁ బరిగ్రహింతురు గాక !

గ్రంథకర్త

భగవదజ్జుక మని పేరుగల యీప్రహసనమునకుఁ గర్త యెవ్వరో గుర్తించుటకు మూలగ్రంథమున నాధారము గానరాదు. కాని దాని వ్యాఖ్యాత (పూర్ణసరస్వతి కావచ్చును. ఈయన మేఘసందేశమాలతీ మాధవాదులకును వ్యాఖ్యాత.) మూలగ్రంథకర్త బోధాయనుఁడని పేర్కొన్నాఁడు. వ్యాఖ్యారంభమున,—

శ్లో. బోధాయనకవిరచితే విఖ్యాతే భగవదజ్జుకాభిహితే,
అభినేయేఽతిగభీరే విశదా నధునా కరోమి గ్రంథార్థాన్.

అంతమున,

శ్లో. ఇతి ప్రహసనాభిఖ్యే పూర్వనాట్య నిబంధనే,
హాస్యగ్రాహిత తత్త్వార్థే టీకా దిక్తత్వదర్శినీ.

శ్లో. యశ్చాసౌ భవభూతి సూక్తి జలధే రర్థౌఘ యాదోగణ
ప్రక్షోభోత్థితభీతిభంజనకరీం వ్యాఖ్యాతరీం నిర్మమే;

తేనేయం విషమేతివృత్తగహనే బౌధాయనీయే పున
ర్నాట్యే గర్భితశాస్త్రజృంభిత వచో గంభీరగుంభే కృతా.

ఒక మూలగ్రంథము ప్రతిలో నిదికలదు:

శ్లో. బోధాయనకవిరచితం బోధాయతనం విముక్తిశాస్త్రాణామ్;
ప్రహసనరత్నం ప్రత్నం భవతు ముదే భగవదజ్జుకీయం వః.

వరరుచి పాణిన్యాదు లగు మునులు కొందఱు శాస్త్రకారులేకాక కావ్యకర్తలుగూడ నయియుండిరి. వారినిఁ బ్రాచీన కవులు కవులనుగా స్తుతించిరి. వారి గ్రంథములనుండి కొన్ని శ్లోకములనుగూడఁ బ్రాచీనాలంకారికు లలంకార గ్రంథములం దుదాహరించిరి. వారి గ్రంథములును గొన్ని యిప్పుడు దొరకి యున్నవి. బోధాయనమహర్షి కూడ నట్లు కావ్యకర్తయై యుండ వచ్చును. మహర్షి యగు బోధాయనుఁ డిట్టి ప్రహసనము రచించె ననుట ప్రత్యయితవ్యము గాదని కొందఱందురు. వరరుచిరచి యించిన యుభయాభిసారికను వా రరయఁ దగుదురు. శ్యామిలకుఁడు పాదతాడితకమం దిట్లు చెప్పినాఁడు:

శ్లో. నప్రాప్నువంతి యతయో రుదితేన మోక్షం
స్వర్గాయతిం న పరిహాసకథా రుణద్ధి;
తస్మా త్ప్రతీత మనసా హసితవ్యమేవ
వృత్తిం బుధేనఖలు కౌరుకుచీం (?) విహాయ.

(యతులై యేడ్చుచుఁ గూర్చున్నందువలన మోక్షము రాదు. పరిహాసకథ స్వర్గలాభమును జెడఁగొట్టదు. ప్రాజ్ఞుఁడు

కచకుచాదులపై నభిరుచిని జెందరాదు గాని హాసించుచునే యుండవలెను.)

శ్రీ రామానుజులవారు తమ బ్రహ్మసూత్రభాష్యమునకు మూలకల్పమని పేర్కొన్న బ్రహ్మసూత్రవృత్తిని (ఇది యిప్పుడుకానరాదు.) రచించిన బోధాయన మహర్షియు, గృహ్యసూత్రాదికర్తయగు బోధాయనమహర్షియు (ఇద్దఱు నొక్కరగుదురో కారో!) మనయెఱుక కందియున్నారు. విష్ణుపారమ్యమును, ప్రపత్తి ప్రాధాన్యమును, జెప్పు రామానుజ మతమునకు మూలాధారమయిన యా బ్రహ్మసూత్రవృత్తిని రచించిన బోధాయనుఁ డీప్రహసనకర్తయగు ననుట యొప్పిదముగా నాకుఁదోఁపదు. ఈ ప్రహసనమున "త్వాంపాతు... రుద్రస్య సదర్పితః పాదః" అని నాందియున్నది; యోగదర్శనమునకుఁ బ్రాముఖ్యము ప్రతిపాదితమయినది; విశిష్టాద్వైత సిద్ధాంత వాసనకూడఁ గానరాదు. కల్పసూత్రకారుఁడుగూడ నీగ్రంథకారుఁడు గాఁగూడదనియే నాతలఁపు. ఆయన ప్రతిపాదించు శాంతికపౌష్టిక శ్రౌతకర్మ ప్రాధాన్య మిందుఁ గానరాదు.

ప్రాచీనకవులు కొందఱు బోధాయనునిఁ గూడఁ గవిగాఁ బ్రస్తుతించిరి. రఘువీరచరితమను నాటకమును రచించిన సుకుమారకవి తననాటక ప్రస్తావనలోను,

శ్లో. యై ర్బోధాయనసూక్తి పుష్పకలికాః కర్ణావతంసీకృత
యేషాం బిల్హణసూక్తిహారకసరాః కంఠా నలంకుర్వతే
మాధుర్యైకభువాంమురారివచసామాస్వాదియైస్స్వాదిమా
సంతుష్యంతి తయేవ నూతనసుధా వేణీషు వాణీషు నః.

నాసికేతోపాఖ్యానము రచియించిన దగ్గుబల్లి దుగ్గ
కవి (శ్రీనాథుని బావమఱఁది) గ్రంథావతరణికలోను,

"సీ. ప్రణుతింతుఁ బన్నగరాజ వాల్మీకి స
త్యవతీతనూజ బోధాయనులను
ప్రార్థింతు దిఙ్నాగ రాజశేఖర కాళి
దాస సౌమిల్లిక భాసకులను."

అని వినుతించిరి. ఈబోధాయనుఁడు బ్రహ్మసూత్ర
వృత్తికారుఁడును గల్పసూత్రాదికారుఁడునుగాక వేఱొకఁడేని
గావచ్చును.

## గ్రంథ ప్రాచీనత

రేచెర్ల సింగభూపాలుఁడు రసార్ణవసుధాకరమున నీభగ
వదజ్జుక ప్రహసనమును బేర్కొన్నాఁడు. *ఆ రేచెర్ల సింగభూ

---

* శుద్ధం కీర్ణం వైకృతంచ తచ్చ ప్రహసనం త్రిధా; శుద్ధం శ్రోత్రియ
శాఖాదే ర్వేషభాషాది సంయుతమ్. చేటచేటీజనవ్యాప్తం తల్లక్ష్యంత
నిరూప్యతామ్; ఆనందకోశ ప్రముఖం తథా భగవదజ్జుకమ్, కీర్ణంతు సర్వైర్వీ
థ్యంగై స్సంకీర్ణం ధూర్తసంకులమ్, తస్యోదాహరణం జ్ఞేయం బృహత్సౌభ

పతి పదునాల్గవ శతాబ్దివాఁడుగావున నీగ్రంథమంతకుఁ బ్రాచీన మనుట యొక విశేషముగాదు. క్రీ. శ.600 లోనున్న మహేంద్ర విక్రమవర్మ యను పల్లవ రాజు చెక్కించిన మామండూరు శిలాశాసనమున నీభగవదజ్జుకముపే రున్నది. ఆగొప్ప శిలా శాసన మిప్పుడు శిథిలమై యక్కడక్కడ కొంతకొంతమాత్రమే చదువఁదగినదిగా నున్నది. ♦

ఈమహేంద్రవిక్రమవర్మ విద్యావిశారదుఁడు. కిరాతార్జునీయకారుఁడగు భారవికవి యీయన యాస్థానమున నుండెను.* ఈరాజు స్వయము మత్తవిలాసమని యొక ప్రహసనమును గూడ రచియించినాఁడు. అది యీనడుమదొరకినది. ముద్రితమైనది. శిలా శాసనమున దానిపేరుగూడఁ గలదు. మత్తవిలాసముతో పాటు దీనిఁగూడ నా మహేంద్రవిక్రమవర్మయే రచించియుండవచ్చునేమో యని యూహించుటకును, వ్యాఖ్యాత బోధాయన కృతమనుట, యితరకవులు బోధాయనుఁ

---

కాదికమ్. యచ్ఛేదం కాముకాదీనాం వేషభాషాది సంగతైః, షండతాపస వృద్ధాద్యైర్యుతం తద్వైకృతంభవేత్, కలికేళిపహసనప్రముఖం తదుదాహృతమ్. ఈశ్లోకము లిటీవల ననంతశయనగ్రంథమాలలో ముద్రితమయిన నాగరీలిపి గ్రంథమందు చేరలేదు. పూర్వము శ్రీ వేంకటగిరి రాజాగారిచే ముద్రితమైన తెలుఁగులిపి గ్రంథమందుఁ గలవు.

♦ సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్సు వాల్యూము IV చూ.

* దండిరచిత మగు అవంతిసుందరీకథను జూడఁదగును. ఈ గ్రంథమును శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించుచున్నారు.

గవినిగాఁ బ్రస్తుతించుట, వేఱొకబోధాయన కవికృతియొఱుఁగ రాకుండుట, కొంత బాధకమయినను, నారెండు ప్రహసనము లందును రచనాసామ్యముండుట కొంతసాధక మగుచున్నది. భగవదజ్జుకము పరిహసించునట్టే మత్తవిలాసముగూడ బౌద్ధ మతమును బరిహసించుచున్నది. భగవదజ్జుక మందున్న వాక్య ములే కొన్ని మత్తవిలాసమందు నున్నవి కాని మత్తవిలా సము భగవదజ్జుకమంత ప్రౌఢముగాలేదు. ప్రాచీనమగు భగవ దజ్జుకమును మహేంద్రవిక్రమవర్మ మత్తవిలాసమం దనుక రించెనేమో! మామండూరు శాసనము స్పష్టముగా గుర్తింపఁ దగియుండెనేని యనుమానములకు నపోహములకు నవకాశము లేకుండెడిది.

కర్త బోధాయనుఁడో, మహేంద్రవిక్రమవర్మయో, మఱొకఁడో యెవ్వరయినను, క్రీ. శ. 600 కుఁ దర్వాతివాఁడు మాత్రము కాఁడని మామండూరుశాసన మిప్పుడుగూడఁ జేరత్తి చెప్పుచున్నది.

## గ్రంథార్థము

ప్రహసనమనఁగానే పాఠకులు సాధారణముగా మన తెనుఁగుదేశమునఁ బ్రకటితమైయున్న లంబోదర ప్రహసన మును స్మరించి దానివలె నిదికూడఁ దుచ్ఛమును జుగుప్సిత మును నగు బండుబూతుపరిహాసముతో నిండియుండునని రోఁత చెందుదు రేమోగదాయని భీతిచెందుచున్నాను. ఇదియట్టిది

గాదు. ఇందుఁ గల హాస్యము విందుగూర్చునది. ఆహాస్యము గూడ నాపాతహృద్యమేకాక యాలోచనామృతమునై యధ్యాత్మతత్త్వబోధక మగుచున్నది. హాస్యచ్ఛలమున నధ్యాత్మతత్త్వమును బోధించుటలోఁ గవి యిం దసాధారణ చాతుర్యమును జూపినాఁడు. వ్యాఖ్యాత యీ ప్రహసనమునఁ బ్రత్యక్షరము యోగదర్శనపరముగా నంతరార్థముఁ జెప్పుచు వ్యాఖ్య రచించినాఁడు. ఆయన చెప్పిన యంతరార్థమిట్టిది:—

శ్లో. అస్మిన్ నాట్యరసే నిసర్గగహనే యోగీంద్రశిష్యా వుభా
వాత్మానౌ పరజీవభేదకథితా వన్యా తథైవాజ్జుకా;
మూలాధారసముద్గతా ససుషిరా నాడీ సుషుమ్నా, పరే
చేట్యా -చోభయ పార్శ్వగే ససుషిరే నాడ్యా విడాపింగళే.

శ్లో. అవిద్యా గణికా మాతా మోహో రామిలకో మతః,
వైద్యోహి కల్ప సంకల్పో కాలస్తు యమ పూరుషః.
ఏవం ప్రేక్షామయం యోగం యుంజన్నర్థకతాపసః,
ప్రత్యంచ మచ్యుతంసద్య స్సాక్షాత్కృత్య సుఖీ భవేత్.

వ్యంగ్యమయిన యీయంతరార్థముమాట యెట్లున్నను వాచ్యమయిన బాహ్యార్థమందే బహుధర్మము లిందుఁ బ్రతిపాదితము లయినవి: ఫలాభిసంధిలేక చేయుకర్మము బంధకము గామి, అంతరాత్మ కర్మాత్మల (పరమాత్మ జీవాత్మల) విభే

దము, భోగాస్థైర్యము, ప్రామాణ్యాపరిజ్ఞానము, అధ్యయనావశ్యకత, సంగరాహిత్యము, యోగప్రశంస, స్వధర్మజిజ్ఞాస, పరధర్మజిహాస, మొదలగునవి.

పయిఁ బేర్కొన్నవానికంటె నీ ప్రహసనమున నింకొక పరమప్రయోజనముగలదు. క్రీ. యేడవశతాబ్దికిఁ బూర్వకాలమున భరతఖండమున బౌద్ధమతమునకుఁ బ్రాభవము హెచ్చుగానుండెను. ప్రత్యక్షానుమానములను మాత్రమే ప్రమాణముగా నంగీకరించుచు భూతదయనే పరమార్థముగాఁ జెప్పుచు నున్న బౌద్ధసిద్ధాంతములు తేటగా లోకమునఁ బాటికెక్కుచుండెను. శబ్దమునుగూడఁ బ్రమాణముగా నంగీకరించి యప్రత్యక్షవిషయముల నందుండి సాధించుచున్న దర్శన మతముల కప్పుడు తల్లు వచ్చెను. ఇప్పటి కేఁబదియేండ్లకు ముందు క్రీస్తుమతమువారి బోధలు, చర్చలు మొదలగునవి భారతీయులకెంత వలపుగొలుపునవిగా నుండి యెంతవ్యాప్తి చెందెనో, యాకాలమున బుద్ధమతమువారిబోధలు, స్తూపములు సంఘములు గూడ, నంతవలపు గొలుపునవిగానుండి యంతవ్యాప్తి చెందెను. బౌద్ధమతమును నిర్మూలించుటకయి యాస్తికులనఁ బరగిన వైదికమతములవా రప్పుడు బహుగ్రంథముల రచించిరి; శబ్ద ప్రమాణ మంగీకరింపని వారిని నాస్తికులని గర్హించిరి; తర్కములందు దించి యోడించిరి. ఏమిచేసినను నెనిమిదవశతాబ్దిలో శంకరు లుదయించి యద్వైతసిద్ధాంతమును రాద్ధాంత

పఱుచునంతదాఁక బౌద్ధమతమునకు నిజముగా బలము క్రుంగ లేదు. బౌద్ధమత ప్రచారమును భంగపఱుచుటకై యాకాల మున నీప్రహసనరచన మావశ్యకమయినది. ఇందు శాండిల్యుఁ డను శిష్యుఁడు బౌద్ధమత వ్యామోహమునఁబడి చెడినవాఁడు. అప్రత్యక్షముల నాతఁడు నమ్మఁడు; శబ్ద ప్రమాణమును విశ్వ సింపఁడు; వేళకు భోజనముఁ జూచుకొనును; అప్రయోజక మయిన యనుతాపముఁ జూపుచు భూతదయ యని యను రుడుగుచున్న వేశ్య నుపచరింపఁ బోవును; తగదన్న యాచా ర్యునిఁ దెగఁదిట్టును. వెంగలితనము నిట్లు వెల్లడించుచున్న శిష్యునిఁ బరివ్రాజకుఁ డెంతయు శాంతుఁడై చక్కదిద్దెను. ఈ ప్రహసనముఁ బ్రయోగించునప్పుడు చూచినఁగాని లేక చదివి నను గాని, బౌద్ధమతమునెడఁ బెడమొగము పెట్టనివా రుం డరు. కవి యిందు బౌద్ధమతము నంత సక్కఁగా వెక్కిరించి నాఁడు. ఆకాలమున నీ ప్రహసనము బౌద్ధమతవ్యాప్తిని గొంత పడఁగొట్టియు నుండును. ఈ ప్రహసనమందు యోగదర్శనము పరమార్థసాధకముగా నిరూపింపఁబడినది; మహేశ్వరాదులు యోగాచార్యులు స్మరింపఁబడిరి. శంకరాద్వైత మాకాలము నకు జన్మింపనే లేదు. ఇందు "అష్టౌ ప్రకృతయః"—ఇత్యా దిగా సాంఖ్యదర్శనముగా నొకవాక్యమును, "అదిణ్ణాదాణాదో" ఇత్యాదిగా బౌద్ధపిటక పుస్తకములలోనిదిగా నొకవాక్యమును గానవచ్చుచున్నవి. కపిలముని సాంఖ్యసూత్రములలోఁగాని

యీశ్వరకృష్ణుని సాంఖ్య సప్తతిలోఁగాని మొదటివాక్యము కానరాదు. అది యే గ్రంథములోనిదో నే నెఱుఁగఁజాలనయితిని ఈవాక్యముగల గ్రంథ మేదే నాకాలమందుండి యిప్పు డంత రించెనేమో! రెండవది బౌద్ధపిటక పుస్తకములలోఁ గలదట. "అదత్తాదానా ద్విరమణం శిక్షాపదం, ప్రాణాతిపాతా ద్విరమణం శిక్షాపదం, ముథావాదా ద్విరమణం శిక్షాపదం, అబ్రహ్మచర్యా ద్విరమణం శిక్షాపదం, అకాలభోజనా ద్విరమణం శిక్షాపదం, అస్మాకం; బుద్ధం, ధర్మం, సంఘం, శరణం గచ్ఛామి." ప్రాకృతమూలమున కిది సంస్కృతచ్ఛాయ. "మాకు పరవిత్తాపహరణమునుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; ప్రాణిహింసనుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; అసత్యోక్తినుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; అబ్రహ్మచర్యమునుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; అకాలభోజనమునుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; నేను బుద్ధదేవుని శరణముచొచ్చెదను; బౌద్ధధర్మమును శరణముచొచ్చెదను; బౌద్ధసంఘమును శరణముచొచ్చెదను." మొదటి యైదింటికిఁ బంచ శిక్షాపదములని కడపటి మూఁడింటికి శరణ త్రయమని వెరసి యెన్మిదింటికి నార్యాష్టాంగములని బౌద్ధులలో వ్యవహారమట.

'రోమాంచోముఖశోషశ్చ' ఇత్యాదిగానిం దుదాహృతమయిన శ్లోకము చరకసుశ్రుతాదులలోఁ గలదేమో గుర్తింపఁజాలనయితిని. ఆకాలమునఁగూడ నపండితులు చేతఁగానివైద్య

ము జేయుచుండుట నిందుఁగల వైద్యహాస్యము తెలుపు చున్నది.

పరివ్రాజకుఁడు వేశ్యాశరీరమునఁ బ్రవేశించి కొంతవింత నడపుచుండఁగా వింతపై వింత యన్నట్లు పరివ్రాజకశరీరమున వేశ్యాప్రాణములను యమపురుషుఁడు ప్రవేశపెట్టెను. తనశరీర మున వేశ్యాప్రాణములకుఁ బ్రవేశముకల్గునని పరివ్రాజకుఁడు ముం దెఱుఁగఁడు. అది జరిగిన తర్వాత వేశ్యాశరీరమందుఁగల పరివ్రాజకుఁడు భాషింపనే లేదు. ఆశ్చర్యముచెంది యాలో చించుచున్నాఁడు. శాండిల్యుఁడును ఆలోచనాంబుధిలో మునిఁ గినాఁడు. కవి యిక్కడ కడునేర్పు చూపినాఁడు.

### కథాస్థానము

అజ్జుక ప్రశ్నింపఁగాఁజేటి 'బావ ఇదుగో వస్తున్నానని చెప్పి నగరంలోకే వెళ్లాడు' అన్నది. వ్యాఖ్యాత యిక్కడ నగర మనఁగా 'పాటలీపుత్ర'మని వ్యాఖ్యచేసినాఁడు. అది యుక్తమే. యమపురుషుడు యమలోకము దారిని బేర్కొనుటలో గంగ నుండి యుపక్రమించి దక్షిణముగానున్న నదీనగనగరాదులను జెప్పినాఁడు. కావునఁ గథాస్థానము గంగకావల నుండవలసినదే కదా!

### తెల్గుచేఁత

ఈ ప్రహసనము ప్రాకృత బహుళము. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో విచ్ఛాయముగాఁ దప్పులతో దీనివ్రాఁతప్రతి

యొకటికలదు. దానిఁజూచి వ్రాసికొని యెట్లో నేను దెలిఁగించి
తిని. కాని కొన్నిచోట్లఁ దప్పులు దిద్దఁగుదురనివిగా నుండెను.
కథారంభముననే "పరివ్రాజకః-శాండిల్య! శాండిల్య! (పృష్ఠతో
కవలోక్య) నతావద్దృశ్యతే; సదృశమస్య తమోవృతస్య" అని
యుండవలసిన వాక్యములోని యేకదేశము 'నతావ ద్దృశ్యతే
సదృశమస్య తపోవ్రతస్య' అని యుండెను. ఇట్టి చిక్కులింకను
బెక్కులుగలవు. కర్తపేరులేని వ్యాఖ్యానము క్రొత్తగా నపుడు
పయిపుస్తకశాలకువచ్చెను. నే నావ్యాఖ్యానము సాహాయ్య
మున సర్వసంశయములఁ దీర్చుకొన్నాను. ఆ వ్యాఖ్యానమునఁ
గూడఁ బ్రాకృతవాక్యములకు వ్యాఖ్యయే కలదుగాని సరిగా
ఛాయలేదు. అయినను నది సరిగా గుర్తింపఁదగినదిగానే
యుండెను. ఇప్పటి తెలుఁగు పలుకుబడి చొప్పున నేనాప్రాకృ
తము నించుక స్వతంత్రించి విడఁబఱిచి యనువదించితిని.
నా తెలుఁగుచేత యెట్లున్నదో కాని మూలగ్రంథము మిక్కిలి
హృద్య మయినదని నే ననఁగలను.

శ్రీభారతీ పత్రికలో నా తెలుఁగుచేత ప్రకటింపఁ
బూనిన సమకాలముననే బీహార్ అండ్ ఒరిస్సా జర్నల్‌లో
మూలగ్రంథము విచ్ఛాయముగానే ముద్రితమై వెల్వడెను. చూ
చితినిగాని యది యనేకలోపములతో నసంగతమై యున్నది.
గ్రంథభాగములే యందు విడువఁబడినవి. దానిఁ బ్రకటించిన
వారు వ్యాఖ్యానము నెఱుఁగరు. నే నిప్పుడు సరిపఱుచుకొన్న

మూలము వారి ముద్రణముకంటె నెంతో గుణవంతముగా నున్నది. వారికి దానికర్తనుగూర్చి కాలమునుగూర్చి యేమియు నెఱుఁగరాలేదు. బౌద్ధమత ప్రశంసనుబట్టి ప్రాచీనమయినదని మాత్రము వారు భావించిరి.

కడుఁజిన్నదగు నీప్రహసన పుష్పమునకుఁ దౌడిమ యింక నెక్కుడుగా నుండరాదుగదా!

శ్రీభారతీపత్రికలోఁ బ్రకటించునప్పుడు కూర్చిన యచ్చుకూర్పును, చెక్కించిన చిత్రమును దర్వాత నే నిట్లు పుస్తకముగా ముద్రించుకొనునప్పు డుచితముగా నొసఁగి యచ్చొత్తించి యిచ్చిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారియెడఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

రక్తాక్షి
విజయదశమి.

వే॥ ప్రభాకరశాస్త్రి.

# భగవదజ్జుకము

---

## ప్రహసనము

(నాంద్యంతమునసూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర—

క. సురవరమకుటేంద్రమణి
స్ఫురితము, శుభలక్షణము, సుపూజితము, నిశా
చరసమితాంగుష్ఠము, శివు
చరణము, మి మ్మెల్ల వేళ సంరక్షించున్.

ఇదె మాయిల్లు లోనికిఁ బోయెదను (పోయి)
విదూషకా! విదూషకా!

విదూ—(ప్రవేశించి)

అయ్యా! ఇదుగో ఉన్నాను.

సూత్ర—ఇతరు లెవ్వరును లేరుగద! నీకొక మంచిమాట చెప్పెదును.

విదూ—సరే; (బయటికి వెళ్ళిచూచి వచ్చి)అయ్యా! ఇత రెవరూలేరు, ఆమంచిమాట యేమిటో సెలవివ్వండి.

సూత్ర—అనేక సిద్ధపురుషుల యనుగ్రహము పొంది గొప్ప శక్తులను సంపాదించినవాఁడు, ఉత్తమలక్షణములు గల వాఁడు, ఒకబ్రాహ్మణుఁడు దేశాంతరమునుండి యిక్కడికి వచ్చుచు, ఇప్పుడు నాకీ క్రిందివిధముగా జోస్యము చెప్పినాఁడు.

"నేఁటికి ఏడవనాఁడు నీకు రాజాస్థానమున దర్శనము దొరకఁగలదు. అప్పుడు నీప్రయోగమునుజూచి సంతోషించి రాజుగారు నీకు గొప్పసమ్మానము బహుమానము జరుపుదురు" అని.

ఆబ్రాహ్మణుఁడు అసత్యములాడువాఁడుకాఁడు గావున నుత్సాహముచెంది సంగీత సాధనము సాగించుచున్నాఁడను.

విదూ—ఐతే; మీ రిప్పుడు నాటకమా ప్రకరణమా ఏది ఆడుదా మనుకొన్నారు ?

సూత్ర—ఇక్కడనే నాకు నాలోచనము; నాటకప్రకరణోద్భవము లయిన వారేహామృగ డిమ సమవకార వ్యాయోగ భాణ సల్లాప వీ థ్యుత్సృష్టి కాంక ప్రహసనాదులగు నాట్యరసములందు హాస్యమే ప్రధానమైనదని నాతలంపు. కాన ప్రహసనమే ప్రయోగింతును.

విదూ—నేను ప్రహసన మెరుగను.

సూత్ర—అట్లైన నేర్చుకొనుము. నేర్వకుండ నేదిగాని రాదు.

విదూ—ఐతే తమరే మరి నాకు నేర్పండి.

సూత్ర—లెస్స.

గీ. బుద్ధిని గుదుర్చుకొని జ్ఞానసిద్ధికొఱకు
నను గమింపుము సన్మార్గమునను నన్ను

(తెరలో)—శాండిల్య! శాండిల్య!

సూత్ర—(విని)

బ్రాహ్మణశ్రేష్ఠుఁడయి బ్రహ్మపదము కోరి
సన్న్యసించిన యోగీంద్రు ఛాత్రునట్లు.

నిష్క్రమించిరి.

ఇది ప్రస్తావన

(పిదప పరివ్రాజకుఁడు ప్రవేశించును.)

పరి—శాండిల్య! శాండిల్య! (వెనుకకుఁజూచి) కానరాకు న్నాఁడే, అజ్ఞానసంవృతుఁడయిన వీని కీనడవడి తగినట్లె యున్నది.

సీ. వివిధరోగములకు వీడుపట్టయి, వార్ధ
కమునకు వశమయి, కాలునకు ర
హస్యంపుఁబొంచు చోటై, యున్న దీదేహ
మడఁగారు నెప్పుడో, పొడిచి పొంగి
పాఱునదిఁ గూలిపడు తటద్రుమమట్లు;
నమ్మరానివి దీనిమెప్పులెల్ల

బహుజన్మకృతపుణ్యావశమున నరజన్మ
మందియు భ్రమసి దేహాత్మబుద్ధి
గీ. నజ్ఞుఁడగువాఁడు బలము ప్రాయమ్ము రూప
మరసికొని పొంగిపోవుచు నవి ఘటించు
దోషములఁ గానలేక తుందుడుకుచెంది
చెడెడు; నయ్యయో యజ్ఞానచేష్టితంబు !

కాఁబట్టి దయనీయుఁడైన యీయజ్ఞానునిపై నపరాధ ములను లెక్కించి లాభములేదు. మరలఁ బిలిచెదను. శాం డిల్య! శాండిల్య! (అంతట శాండిల్యుడు ప్రవేశించుచున్నాఁడు)

శాండి—ఓహో ! నాకథ తెలుచుకొంటున్నాను. మొద టిది. నేను కాకులకు పింణాలువేయగా మిగిలినకూళ్లతో పొట్టల్నించుకొంటూ, పొట్టకోసినా అక్షరమ్ముక్కైనా లేక, మెళ్లోజంఝ్యం మాత్రం వేసుకొని అంతటితోనే బ్రాహ్మణ్యం అబ్బిందిగదా అని సంతోషించుకొంటూ ఉండే కుటుంబంలో పుట్టాను. ఆతర్వాత రెండోది; మాకొం పలో బువ్వకు లేకపోవడంచేత, ఆకలికి తాళలేక పెంద లాడి పిండానికి ఆశపడి బౌద్ధశ్రమణకులలో కలిశాను. వాళ్లు ముండమొయ్య ! అక్కడ ఆతొత్తుకొడుకులు, ఒంటిపూట సాపాటువాళ్లే కావడంచేత, ఆకలికి ఆగలేక దాన్ని విడిచిపెట్టి చీవరము చించివేసి, పాత్రము బద్దలుకొట్టి, గొడుగు ఒకటిమాత్రం పుచ్చుకొని బయలుపడివచ్చాను. ఇహ మూడోది; ఈ చెడ్డస్వాములవారి కిప్పుడు సరకులు

మో శేగాడిద నైనాను. స్వాములవారు ఈ చేరువనే ఉన్నా రను కొంటాను. ఆయన్ని చేరబోతాను. ఏరీ స్వాముల వారు? ఎక్కడికో వెళ్ళినట్టున్నారే; ఆఁ! ఈ చెడ్డసన్న్యాసి పెందలాడి తిండిమీద ఆశపడి తాను ఒంట్రిగానే భిక్ష మెత్తడానికి ముందుగా పరుగెత్తాడల్లే ఉంది. అట్టే దూరం పోకముందే వెంటబడి కలుసుకొంటాను. (పరిక్రమించి చూచి) ఇరుగో! స్వాములవారు! (చేరఁబోయి) అయ్యా! స్వాములవారు! క్షమించండేమి; క్షమించండేమి;

పరి—శాండిల్యా! వెళ్ళవకుము. వెళ్ళవకుము.

శాండి—అయ్యా! స్వాములవారూ! నిత్యకళ్యాణం పచతోర్ణ ణంగా ఎప్పుడూ ఉత్సవాలు జరుగుతూ, సుఖప్రధానమై, వుండే యీ జీవలోకంలో, మీరు భిక్షాటనం చేసేటప్పుడు ఏవిధాన వర్తిస్తారండీ?

పరి—విను.

చ. అడఁకువఁ బూని ధర్షణము
　　లందియుఁ గుందక కామమానముల్
విడుకొని బీదలిండ్ల కడ
　　భిక్షము నెత్తి శరీరధర్మముల్
గడపుచు, దుఃఖదోషబహు
　　ళంబగు లోకమునన్, మొసళ్ళ పెన్
మడుగునఁబోలె నెప్పుడుఁ బ్ర
　　మాదముపాల్పడ కేఁ జరించెదన్.

శాండి— పద్యకము :

తల్లితండ్రి లేరు, తమ్ము లన్న లేరు
దైవానుగ్రహముత్తదే, వొంటిగాణ్ణి !
పొట్టకూటికోస మిట్టా వస్తిఁగాని
ధర్మలోభము నాకింతైనా లేదండీ!

పరి—శాండిల్య! ఇదియేమోయీ !

శాండి—అవునండీ! తమరు, ధర్మమూ, అధర్మమూ, రెండూ బంధకము లవుతవని కాదండీ అన్నారు.

పరి—నిజమే! ధర్మము అధర్మము ఫలాభిసంధితోఁ జేసినచో బంధకములే అవును.

గీ. ఎవఁడు ఫలముగోరి యెదియేని కర్మ మూ
హించి చేయు నవహితేంద్రియుఁడయి
వానికొఱకు దానిఫలము సురల్ పర
మందు దాఁచియుంత్రు న్యాసమట్లు.

శాండి—అయితే, అయ్యా! ఎప్పుడండీ ఆ అకామకర్మఫలం పొంద గలిగేది?

పరి—ఎప్పుడు విరాగైశ్వర్యము లభించునో అప్పుడు.

శాండి— ఆవిరాగైశ్వర్యం ఎట్టా లభిస్తుందండీ!

పరి—అసంగత చేత

శాండి—ఓస్వాములవారూ! ఇదేమిటండోవ్. అసంగత అః ఒకటి అంటున్నారు? అదేమిటో కొంచెం సెలవియ్యండి

పరి—అది రాగద్వేషములకు మధ్యస్థమైనదశ!

గీ. దుఃఖమున సుఖమున నిత్యతుల్యబుద్ధి
భయముననుహర్షమున నేకభావకలన
శత్రులందు మిత్రులయందు సామ్యచింత;
ఘనులు పలుకుదు రది యసంగత యటంచు.

శాండి—అయ్యా! ఇటువంటిదికూడా ఉంటుందా?

పరి—లేనిచో పేరెట్లు కలుగును?

శాండి—అయ్యా! అట్లా ఉండడము సాధ్యమౌతుందంటారా?

పరి—సందేహ మేమి?

శాండి—అబద్ధం. ఇది వట్టి అబద్ధం.

పరి—ఏ హేతువుచేతనోయి అట్లనెదవు?

శాండి—అయ్యా! స్వాములవారూ! అది సాధ్యమే ఐతే మీా రెందుకండీ నామీాద కోప్పడతారు?

పరి—అధ్యయనము చేయవని.

శాండి—నేను అధ్యయనము చేస్తేనేమి చేయకపోతేనేమి; ముక్తులైనవారికి మీా కెందు కీగోడవ?

పరి—కాదోయీ, అట్లుకాదు, అభ్యుపగతుఁడైన శిష్యుని మేలుకొఱకు దండింపవలసినదని స్మృతులు చెప్పుచున్నవి. కాఁబట్టి కోపము లేనివాఁడనయినను నేను నీశ్రేయస్సు కొఱకు దండించుచున్నాను.

శాండి—ఆశ్చర్యముగా ఉందే; ఆశ్చర్యముగా ఉందే; కుపి

తులు కాకుండానే కొట్టుతున్నారుగా నన్ను! ఇహ కట్టి పెట్టండి ఈకథ. అతిక్రమించి పోతున్నది భిక్షావేళ.

పరి—తెలివిమాలినవాఁడా! ఇది ప్రాతస్సమయము. మధ్యాహ్నసమయము గాదు; ధాన్యము దంచి రోకళ్లు మూలఁ బెట్టినతర్వాత, పొయ్యిలు చల్లాఱినతర్వాత, అందఱును ఆరగించినతర్వాత, మధ్యాహ్నకాలమందు భిక్షుకుఁబోవ లెనని ధర్మోపదేశమున్నది. కాఁబట్టి యందాఁక విశ్రమార్థ మీయుద్యానవనమునకుఁ బోవుదము రమ్ము.

శాండి—ఆహా! మీరుచెప్పే దొకటి, చేసేదొకటిగా ఉన్న దేమిటండీ!

పరి—ఎట్లు?

శాండి—అయ్యా! తమరు సుఖదుఃఖసమానులుగా!

పరి—అవును సుఖదుఃఖములందు సమానమైనదే అంతరాత్మ. కర్మాత్మ విశ్రాంతిని గోరుచున్నది.

శాండి—అయ్యా! స్వాములవారూ! ఏమిటో అంతరాత్మ అంటు న్నారు, కర్మాత్మ అంటున్నారు. ఎటువంటివండి అవి? అంతరాత్మ అంటే ఏమిటి? కర్మాత్మ అంటే ఏమిటి?

పరి—విను.

గీ. స్వప్నమందు గగనసంగతమగునది
యంతరాత్మ, మఱి సమస్తవిధులు
గష్టములు సుఖములుఁ గనునది కర్మాత్మ

జనుఁ డనంగ దేహి యనఁగ నదియె.

శాండి—అజరమై, అమరమై, అచ్ఛేద్యమై, అభేద్యమై, ఉన్న దేదో అది అంతరాత్మ. నవ్వేది, నవ్వించేది, శయనించేది, భుజించేది, నశించేది, ఏదికలదో అది కర్మాత్మ. ఇంతేనా?

పరి—ఎట్లు గ్రహింపవలెనో అట్లు గ్రహించితివి.

శాండి—చాలుచాలు. కట్టిపెట్టండి. పట్టుపడ్డారు.

పరి—ఎట్లు?

శాండి—అయితే ఆ అంతరాత్మా, ఇప్పుడీ కనబడేమీరూ అంతా ఒక్కటేకదా! శరీరం లేకపోతే ఇహ మరేమీ లేదాయెగదా! మళ్లీ ఇపుడు అంతరాత్మ వేరు; కర్మాత్మ వేరు; అంటూ ఏమో చెప్పసాగిస్తిరి. పొందుబాటుగా ఉందా యిది ?

పరి—లౌకికముగానిప్పు డిట్లుచెప్పినాఁడను. ఇతిహాస పురాణాదులు, లౌకికరీతిని సురనరపశుపక్ష్యాదిజీవభేదములసత్యత నంగీకరించుచున్నవి.

శాండి—అదిఅంతా అట్టా ఉండనియ్యండి. మీరెవరు ? 'మీరు' అనిపిలవబడే మీరెవరు?

పరి—విను.

చ. అనలము వాయువుం జలము
నాకస మన్నవి పొల్లు గూడఁగాఁ
బొనరినపార్థివాణువుల

ప్రోవు చలించెడు విగ్రహంబునకా
దనరఁగ వీనులుం గనులుఁ
ద్వక్కును ముక్కును జిహ్వ గల్గఁగాఁ
గనె నరసంజ్ఞ, నేనన నె
కానొకఁ డట్టిఁడఁ బ్రాణిధర్ముఁడకా.

శాండి—ఆహా! ఇంతకూ మిమ్ము మీరే ఎరగ లేకుండా ఉంటిరి. ఆత్మ నింకా ఎరిగుండేదేమిటి? సరేలెండి! అయ్యా! ఇదుగో ఉద్యానము.

పరి—నీవు ముందుగాఁ బ్రవేశింపుము. సందడిలేక శాంతమై యుండునరణ్య ప్రదేశములఁ జూచుకొని ప్రవేశింపఁ దగినవారము మేము.

శాండి—అయ్యా! తమరే ముందు ప్రవేశించండి. నేనే తర్వాత వస్తాను.

పరి—అదేల?

శాండి— పాతకాలపుముండ మా అమ్మ చెప్పేది- ఈవనంలో అశోకవృక్షపు చిగురుటాకులచాటున పెద్దపులి ఉన్నదని. అందుచేత భయమవుతున్నది. అయ్యా! మీరే ముందు దయచెయ్యండి.

పరి—మంచిది.

(ముందువెనుకలుగా ఇద్దఱు ప్రవేశించుచున్నారు.)

శాండి—అయ్యో! అయ్యో!! పెద్దపులి పట్టుకు పీకుతున్న

దండో్వు! ఈపులిబారినుండి తప్పించండో్వు! దిక్కుమాలి నవాణ్ణి పులినోట పడిపోతున్నానండో్వు! ఇదుగో కారుతున్నది కంఠంలోనుంచిరక్తం.

పరి—శాండిల్యా! భయపడకు. ఇది నెమిలి గదవోయి!

శాండి—నెమలాండి! ఆఁ! నిజంగా!

పరి—ఔనోయి! నిజముగానే నెమిలి.

శాండి—అమ్మయ్యా! నిజంగా నెమలే అయితే ఇహ కళ్లు తెరుస్తాను.

పరి—భయపడఁబనిలేదు. తెఱవుము.

శాండి—అమ్మ!! లంజెముండకొడుకు, పులిగాడు; నన్ను చూచి భయపడి నెమలిరూపంతో పరుగెత్తాడుసుమా! (ఉద్యానము నిరూపించి) ఏమిఉద్యానం, బలే! బలే!! సంపంగులు, జువ్వులు, కలిగొట్లు, నీపములు నిచుళములు, తిలకములు, గోరంటలు కొండగోగులు, కల్హారములు, మామిళ్లు ప్రేంకణములు, ఏపులు, తాళ్లు, తమాలములు, పొన్నలు, నాగములు, పొగడలు, సరళములు, సర్జములు, సిందువారములు, సప్తపర్ణములు, గన్నేరులు, కొండమల్లెలు, చందనములు, అశోకములు, మల్లెలు, నంద్యావర్తములు, తగరములు, ఖదిరములు, అనంట్లు మొదలయిన వృక్షాలతో శోభిస్తున్నది. వసంతుడు తాండవమాడు

తున్నాడు. చిగురుటాకులు, ముదురుటాకులు, పువ్వుగు త్తులు, నిండిఉన్నవి. మాలతులు, గురివెందలు, తీగెపంది ళ్లల్లు కొనిఉన్నవి. నెమళ్లు, కోవెలలు, చిలకలు, తుమ్మె దలు, తేనెటీగలు, మధురధ్వనులు చేస్తున్నవి. ప్రియజన మును వదలి ఉండడంచేత చివికిచింతిస్తూఉండే పడుచు ప్రాయపువారికి పరితాపాన్ని, జోడుపీడకుండా ఉండే సొగసర్లకు సుఖాన్ని కలిగిస్తూ ఈఉద్యానము ఎంతరమణీ యముగా ఉన్నది!

పరి—మూర్ఖుడా! పూటపూటకు నింద్రియములు హీనగతి పొందుచుండగా నీకిందు రమణీయత యెట్లుకన్పట్టుచున్న దోయి! చూడుము:

ఉ. ఆమని వచ్చె గ్రొంజిగురు
టాకునగల్ ధరియించి యంచు, ఫు
ల్లామలపుండరీకమయ
మై శరదాగమ మింపుగొల్పెనం,
చీమెయి వచ్చుచో ఋతువ్ర
లెంతయు నజ్ఞులు సంతసింతు రి
స్సీ! మృతి చేరువౌ టెఱుఁగరే
రమణీయత యిందు నున్నదే!

శాండి—ఏది యెప్పుడు రమణీయముగా ఉంటుందో దానిని అప్పుడు రమణీయంగా ఉన్నదంటారు.

పరి—ప్రాజ్ఞసమ్మతము కానిమాట మాటాడితివి. విను:

గీ. గతముఁగూర్చి మిగుల వెతకుదు్ఛవా, రనా
గతముఁగూర్చి యాశఁ గాంచువారు
వర్తమానమందుఁ బరితృప్తిగననివా
రెందుగాని ముక్తి నందలేరు.

శాండి—త్రోవ చాలాపొడుగుగాఉంది. మనమిప్పుడు ఎక్కడ కూర్చోవడము ?

పరి—ఇక్కడనే కూరుచుండము.

శాండి—ఇక్కడినేల అపరిశుభ్రంగా ఉంది.

పరి—అరణ్యభూమి పవిత్రమైనది. పరిశుద్ధమైనది.

శాండి— మీకుగనక బడలికగా ఉన్నదంటే, కూర్చోవలెనని బుద్ధిపుట్టిందంటే, ఇహ, చెడ్డభూమినైనా మంచి భూమినిగా చేసివేస్తారు.

పరి—ఓయీ! శ్రుతి ప్రమాణము. నేనుగాదు.

క. అతిమానోన్మాదమున న
హితమును హితమ యని యెంచు చెప్పడు నాత్మో
దితమే ప్రమాణమని కొను
కితవులకుం బరములేద కించిత్తైనన్.

శాండి— తెగచెప్తూ ఉంటారు - అట్టాగు ఇట్టాగు అదీ యిదీని; మీ కో ప్రమాణమున్నట్టు నాకు తోచలేదు.

పరి—కాదోయి! అట్లుకాదు.

గీ. లోకమంతయు విబుధులు ప్రమాణమనుదాని
నే ప్రమాణముగను నీవుఁ గొనుము
అప్రమాణ మెప్పు డొప్పరుసుమ్ము ప్ర
మాణమంచు సుప్రమాణవిదులు.

శాండి—అయ్యా!నాకు తోచ లేదండీ. మీకో ప్రమాణం ఉన్నట్టు - అట్టూ ఇట్టూ చెప్పుతూ ఉంటారు.

పరి—నాయనా! అధ్యయనము చేయుమోయి! తెలియును.

శాండి—నా కక్కర లేదండీ అధ్యయనము.

పరి—ఎందుకని ?

శాండి— అధ్యయనానికి అర్థ మేమిటో చెప్పండి?

పరి—అధ్యయనము చేసినవారికిఁగూడ నధ్యయనార్థములు కాలాంతరమునఁ దెలియఁ దగినవిగానుండును. కావున నీవు ముందుగా నధ్యయనము చేయుము.

శాండి—అధ్యయనముచేస్తే ఏమివస్తుందండీ?

పరి—విను- జ్ఞానము; జ్ఞానమువలన విజ్ఞానము; విజ్ఞానమువలన సంయమము; సంయమమువలనఁ దపస్సు; తపస్సువలన యోగప్రవృత్తి; యోగప్రవృత్తివలన నతీతానాగతవర్తమానతత్త్వదర్శనము; వీనివలన అష్టగుణమైన యైశ్వర్యము లభించును.

శాండి—అయ్యా! స్వాములవారూ! ప్రత్యక్షములుగాని విషయములందు నాబుద్ధిని మీాయిష్టమువచ్చినట్టు పరిభవించి

మాట్లాడుతున్నారు. నాకెందుకుగాని అదంతా. అయితే! అధ్యయనంవల్ల ఎవ్వరికి అగపడకుండా పరులకొంపల్లోకి దూరడానికి శక్యమౌతుందా?

పరి—నీకోరిక యెట్టిదోయి?

శాండి—నాకోరిక యెట్టిదో చెప్పమంటారా? ఆశాక్య శ్రమణకులకోసం, సంఘాలలో తయారవుతూఉండే, కమ్మకమ్మని భక్ష్యభోజ్యాలను కడుపునిండుగా ఆరగించడం నా కోరిక!

పరి—అయ్యో! మిక్కిలి తుచ్ఛమైనది గదోయి నీకోరిక!

శాండి—ఇందుకోసమే కాదండీ తమరు బుఱ్ఱ గొరిగించుకొన్న దీని? ఇంతకంటె వేరే ప్రయోజనం నాకు కనపడలేదు సుమండీ!

పరి—ఆఁ, ఆఁ, కాదట్లు కాదు.

గీ. విప్రులు మహాత్ము లెపుడు సేవించుచుంద్రు
సురలునసురులుఁగూడ మెచ్చుకొనుచుంద్రు
అవ్యయమ వార్యమక్షోభ్య మద్భుతము మ,
హత్తరం బట్టియోగ మే నభ్యసింతు.

శాండి—తమరొక్కరూ సమాహితులై కూర్చుండి యోగాభ్యాసచింత జరుపుకోండి. నేను సుసమాహితుణ్ణై సుభోజనచింత జరుపుకొంటాను. అయ్యా స్వాములవారూ! యోగం యోగం అని మీవంటి సన్న్యాసిస్వాములవార్లు తరు

చుగా ప్రశంసిస్తూ ఉంటారు! ఎటువంటిదండీ ఆ యోగ మనేది ?

పరి—విను:

గీ. జ్ఞానమూలము ద్వంద్వనాశకము తత్త్వ
సంస్థితమ్ము మహాతపస్సార మింక
ద్వేషమునకు రాగమునకును వేఱుపడిన
తీరుగలది యోగంబని తెలియుమోయి!

శాండి—'ఆహార ప్రమాదము సర్వ ప్రమాద'మని బోధించిన బుద్ధదేవుడికి పదివేల నమస్కారాలు.

పరి—శాండిల్యా! ఇదేమోయి!

శాండి—స్వాములవారూ! ఎరగరా ఏమిటి? మొదట నేను పెండలాడి తింటికోసం శాక్య శ్రమణకులలో కలిశాను.

పరి—అక్కడ నేమేని నీకు పరిజ్ఞానముకల్గెనా ?

శాండి—కలిగింది - కలిగింది - బోలెడంతకలిగింది.

పరి—కానీ, ఏదో విందుము.

శాండి—అయ్యా! ఐతే వినండి "అష్టౌ ప్రకృతయః, షోడశవికారాః, ఆత్మా, పంచవాయవః, త్రైగుణ్యం మనః, సంచరః, ప్రతిసంచరశ్చేతి." ఈవిధంగా జినభగవానులు పిటకపుస్తకాలలో చెప్పినారు.

పరి—శాండిల్యా! ఇది సాంఖ్యసమయము, శాక్యసమయము కాదు.

శాండి.—ఆకలిగా ఉండడంచేత మనస్సంతా అన్నముమీదికి పోయింది. అందుచేత లోపల అనుకొన్న దొకటైనా పైకి చెప్పింది ఇంకొకటి అయింది. ఇప్పుడు చెపుతాను వినండి. "అదిణ్ణాదాణాదో వేరమణిం శిక్ఖాపదం, పాణాదిపాదాదో వేరమణిం శిక్ఖాపదం, ముథావాదదో వేరమణిం శిక్ఖాపదం, అబ్బమ్మచయ్యాదో వేరమణింశిక్ఖాపదం, అకాలభోఅయణాదో వేరమణిం శిక్ఖాపదం అహ్మణాం, బుద్ధం ధమ్మం సంఘం సరణంగచ్ఛామి."

పరి.—శాండిల్యా! స్వసమయమును విడనాడి నీవు పరసమయమును బలుకుట యుక్తముగాదు.

గీ. తమముపీడుకొనుము త్యజియింపుము రజస్సు
సత్త్వమందు సంప్రసక్తిఁ గనుము
ధ్యానయోగమందుఁ దగిలి యుపాసింపు
మిదియె జ్ఞానమునకు నొదవు ఫలము.

శాండి.—అయ్యా! స్వాములవారూ! మీరు సమాహితులై యోగాన్ని చింతించండి. నేను సుసమాహితుణ్ణై సుభోజనమునే చింతించుకొంటాను.

పరి.—కట్టిపెట్టుమోయి యీకథను.

గీ. ఇంద్రియముల నాత్మయందు యోజింపుము
సకలజగము మేన సంగ్రహింపు

సర్వమందు నాత్మసమవేక్షణ మొనర్పు
సత్త్వమాశ్రయింపు జ్ఞానమునను.

(అంతట గణిక, ఇద్దరు చెలికత్తెలు, వత్తురు.)

గణిక—ఓశే, మధురికా! మధురికా! ఎక్కడనే ఎక్కడనే రామిలకుడూ!

చేటి— అజ్జుకా! బావ, ఇదుగో వస్తున్నానని చెప్పి నగరంలోకే వెళ్లాడు.

గణి—ఓశే! అక్కడి కెందుకువెళ్లాడోగదా!

చేటి—ఆఁ! ఇంకో లేముంది; జూదగాళ్లను తొందరపెట్టేటందుకు వెళ్లాడు.

గణి—ఇంతసేపైనా ఇంకా జూదం ముగియలేదటే!

చేటి—బాగానే ఉంది! మంచిమాటన్నావు. జూదమంటే తప్పదాగడంగాదటే! సిగ్గుతో చితికిపోయే స్త్రీలనుకూడా ఆతాగుడు గంతులువేయించి, రచ్చకెక్కేటట్టు చేస్తుందే! దానిమజా మగవాళ్లకు ఓపట్టాన ఒదుల్తుం దనుకొన్నావు?

గణి—వెళ్లు, తొందరపెట్టి తీసుకురా!

చేటి—అజ్జుకా! అట్టాగే వెళ్లుతున్నాను, పిల్చుకొని వస్తాను. (వెళ్లును.)

గణి—ఓశే, పరభృతికా! ఎక్కడ కూర్చుందామే; చెప్పు, ఎక్కడకూర్చుందాము?

చేటి—అజ్జుకా! ఇదుగో పూచినమామిళ్లు, తిలకములు, చుట్టుకొని ఉన్న యీశిలాపట్టముమీద కూర్చుందాము. కూర్చుండి ఏదీ ఒకపాట పాడు.

గణి—పరభృతికా! సరే. అట్లాగే.

(ఇద్దఱు కూర్చుందురు, ఇద్దఱును పాడుదురు.)

గేయము.

పరభృతమధుకరరుతశింజితములు
మొరయ చూతశరముల్, మునిజన
విరాగపరిహారముల్, విడుచుచు
పరాక్రమము చెలఁగఁగ, మదనుఁడు,
బలే! యిందు మెలఁగుఁగ.

శాండి—(విని) ఆహా! కోయిలకూత! (చెవియొగ్గివిని) కోయిల కూతగాదు. నేయిపోసినపాయసమల్లే బల్లేమధురంగా ఉంది. ఎవరోపాటపాడుతున్నారు! కాసేపోయిచూస్తాను. (కొంచెము నడచి చూచి) బలే! బలే! ఎవర్తోగదా యీపడుచుపిల్ల! మంచి అందగత్తె; దీని అలంకారాలు పెట్టేవి తీసేవి గావు. సహజాలంకారాలు. ఆచూపు! ఆరూపు! ఆహా! ఈ ఉద్యానానికంతా అలంకారంగా ఉందిగదా!

చేటి—అజ్జుకా!

శాండి—అశ్శై! ఆఁ! ఇది బోగంది! 'అజ్జుకా' అని పిలుస్తు న్నది! డబ్బుగలవాళ్లకుంది అనుభవము! ధనవంతులు ధన్యులు! (చంకలు తట్టుకొనును.)

చేటి—అజ్జుకా! ఇంకోపాట పాడుదూ!

గణి—అట్లాగే (పాడుచున్నది).

గేయము

వసంతసమయప్రాభవదర్పం
బెసఁగ విషమశరుఁడు, అశోక,
ప్రసవబాణధరుఁడు, మునిమా
నసములైనఁ జెదరఁగ, జేయఁగ,
గసిక్కుమన నేయుఁగ.

శాండి—అతి మధురముగా స్రవిస్తున్నది, కంఠములోనుంచి. స్వాములవారూ! వినండి!

పరి—ఓయి! చెవులున్నవిగాపున శబ్దము నవి గ్రహించు చున్నవి. వినుటయం దాసక్తి నాకు లేదు.

శాండి—ఆసక్తి పుట్టుతుంది బాబూ! ఇప్పుడు గనక చేతిలో పైసా ఉన్నదీ అంటే;

పరి—ఆఁ! ఆఁ! తిన్నగా మాటాడుము.

శాండి—కోప్పడకండి అయ్యా! కోప్పడకండి. స్వాములవార్లు కోప్పడరాదు.

పరి—ఓయీ! ఇదిగో! మాటాడను.

శాండి—సరి. అయితే మీ రిప్పుడు సిసలైనస్వాములవాళ్లు.

(యమపురుషుఁడు ప్రవేశించును.)

యమపురుషుఁడు—ఇదిగో వచ్చితిని.

గీ. పుణ్యపాపకృత్యముల సాక్షి, జీవులఁ
గడపువాఁడు కర్మ ముడిగినంత
నంతకుండు జీవితాంతమౌవారికి
యాతనాంగ మొసఁగు మనియె నన్ను.

శా. నానారాష్ట్ర నదీవనాచలవతీన్
ధాత్రిన్ విలోకించుచుం
బైనీ ర్నిండిన మబ్బు లుబ్బుకొని క్ర
మ్మన్ దప్పుకొంచుం బయిం
బై నాచారణసిద్ధకిన్నరయుతా
భ్రంబందు నేతెంచుచున్
నే నయ్యంతకుఁ డానతిచ్చినటుగా
నీయూరికిన్ జేరితిన్.

కాని ఆ స్త్రీ యెక్కడనున్నదో! (చూచి) అదిగో!
ఉన్నదే! అదే!

గీ. చివురుగుబురుల బలసి పసిండిమిసిమి
గలయశోకంపుఁబూగుత్తు లలమికొనఁగఁ

జాటువడి నీటుగుల్కు నీచాన, సంజ
మబ్బు లలమఁగా లేఁజందమామవోలె.

కానీ, ఇంకను గొంచెము కర్మావశేషమున్నది. ముహూర్తముండి ప్రాణముల హరింతును.

చేటి—అజ్జుకా! ఎంత అందముగా ఉందే ఈ అశోకంచిగురుటాకు! దీన్ని తుంచుతాను!

గణి—వద్దు. నీవు వద్దు. నేనే తుంచుతాను.

యమ—సరి. ఇదే అదను. సర్పాకారము ధరించి అశోకశాఖనధిష్ఠించి, దీని ప్రాణములఁ దీసెదను. ఇదిగో యిప్పుడు!

సీ. పడుచుప్రాయపుబెడంగడరుముద్దులగుమ్మ
నగవుపొల్పారు నెమ్మొగముచాన
పిక్కటిల్లుపిఱుందుటెక్కు గల్గినయింతి
తియపల్కులొల్కు వాతెఱమిటారి
కలువరేకులవంటి కన్నులు గలపొల్తి
గందంబుపూసిన యందగత్తె
ఆసేచనకమైన మైసారు గలలేమ!
వారుణీమదము చెన్నారునారి!
అరరె! మజ్ఝారె! యయ్యరే! యట్టిదాని
సర్వసౌభాగ్యమును రిత్త సమయునట్లు
బాల నిదె యొక్కత్రుటిలోనఁగాలయముని
ప్రోలికిని నే నిదే కొనిపోవువాఁడ.

గణి—(చిగుళ్లు గోయుచున్నది)

యమ—ఇదే అదను కాటు వేయుటకు.

గణి—అయ్యో! ఏదో కరిచింది నన్ను.

చేటి—(తరుశాఖనుజూచి) అమ్మయ్యోవు! అజ్జుకోవు! ఇదుగో అశోకపుచిగుళ్ల చాటున తాచుపామేవు!

గణి—ఆఁ! ఆఁ! పామటే! పామటే!!

(అని క్రిందఁ గూలుచున్నది)

శాండి—(చేరఁబోయి) అమ్మా! ఏమిటిది ?

చేటి—అయ్యో! ఈ అజ్జుకను పాము కరిచింది.

శాండి—అయ్యో! స్వాములవారూ! ఈబోగంపిల్లను పాము కరిచిందండి.

పరి—దానికిఁ గర్మక్షయ మయినదికాఁబోలును. ఏమనఁగా:

గీ. జన్మ మందుచునుందురు స్వస్వకర్మ
మనుభవింపఁగాఁ బ్రాణు లీయవనిఁ దఱచు
కర్మ మది తీఱఁగా మృతిగాంచుచుందు
రవల వేఱొక్కచో జన్మమందుకొఱకు.

చేటి—అజ్జుకా! బాధగాఉందా?

గణి—నావొళ్లు విడివిడిపోతున్నట్టుంది. నాప్రాణాలు లేచి పోతున్నట్టున్నవి. పడుకోవలెననిపిస్తున్నది.

చేటి—తిన్నగా పడుకో అమ్మా;

గణి—ఓశే! అమ్మకు దణ్ణం పెట్టానని చెప్పు.

చేటి—ఇంటికి వెళ్లి అమ్మకు నీవే దణ్ణం పెట్టుదువుగాని.

గణి—రామిళకయ్యను కౌగిలించుకొన్నానని చెప్పు.

(అని మూర్ఛితయై పడుచున్నది)

చేటి—హా! అయ్యో! పడిపోయిందే అజ్జుక.

యమ—అబ్బ! ప్రాణములు లాగితిని. ఇదిగో నేను

సీ. ఉత్తరంగను గంగ నుత్తరింతు శుభప్ర
వాహ నర్మద నంగవైచి చనుదు
సహ్యాద్రిపయినుండి సాఁగుదు గోదావ
రీ కృష్ణవేణ్ణుల నాక్రమింతు
శ్రీపర్వతమ్ముఁ గాంచీపురమ్మును మీఱి
నెగయుదుఁ గావేరి నిస్తరింతు
తామ్రపర్ణిని జంగదాఁటుదు మలయప
ర్వతముఁ గుప్పింతు సంద్రముఁదరింతు

గీ. లంక నంగవించి లంఘింతు నంతట
విక్రమించి వాయువేగమునను
ధర్మరాజు రాజధానికిఁ బూనికి
మీఱ గంతుగొందుఁ జేరుకొందు.

చేరుకొని యక్కడ విశాలశాఖమగువటవృక్షముక్రింద గూర్చున్న చిత్రగుప్తునిఁ బిలిచెదను. (వెళ్లును)

చేటి—అయ్యో! అజ్జుకా!

శాండి—స్వామీ! ఈబోగంపిల్ల తనప్రాణాలను విడుస్తున్నది.

పరి—మూర్ఖుఁడా! ప్రాణులకుఁ బ్రాణములు పరమప్రియములు గదా! ప్రాణములే శరీరమును విడచి పోవుచున్నవనుము.

శాండి—ఛీ! లేచిపో! జాలిమాలినవాడా! చనవులేనివాడా! రాతిగుండెవాడా! రోతమనసువాడా!

పరి—నీకోరిక యేమోయి?

శాండి—మరేమీ లేదు, నీకు అష్టోత్తరశతనామాలు పారాయణ చెయ్యవలెనని.

పరి—కానిమ్ము. నీయిష్టము.

శాండి—అయ్యో! స్వాములవారూ! నాకడుపు తరుక్కుపోతున్నదండీ!

పరి—ఎందుకోయి ?

శాండి—మనకు స్వజనమండీ ఈబోగంది.

పరి—ఏమీ! స్వజన మెట్లగును?

శాండి—ఈబోగందికూడా పరివ్రాజకులుమల్లేనే ఎక్కడా స్నేహం పాటించదుగాదండీ!

పరి—నిజమే! స్నేహము దుర్లభమే! అయినను అర్థసంబంధ ముండెనేని వేశ్య స్నేహముపాటించును. అట్లే

గీ. తద్ద నిర్మములై మోక్ష ముద్దేసించి
శాస్త్రవిహితమగు నడవడిజరుపువారు
వారు ప్రేమపరాఙ్ముఖుల్ వారిహృదయ
ములనుగూడ గుణాపేక్ష మొలకలెత్తు.

శాండి—అయ్యా! స్వాములవారూ! నిబ్బరించుకోలేకుండా ఉన్నానండీ! దగ్గిరకుపోయి యేడుస్తాను.

పరి—వలదు వలదు, పోవలదు.

శాండి—కోప్పడకండి. స్వాములవారు కోప్పడరాదు. (చేర బోయి) హా! అజ్జుకా! వలపులకుప్పా!

చేటి—అయ్యా! ఏమిది?

శాండి—అమ్మా! స్నేహమే! కడుపు తరుక్కుపోతున్నదే.

చేటి—(ఆత్మగతముగా) అవును. నిజమే! సాధుజనులంటే అందరిమీదా అనురాగంగలవారు గదా!

శాండి—అమ్మా! తాకిచూస్తాను దీన్ని,

చేటి—అయ్యా! దానికేమి తాకి చూడండి.

శాండి—హా! అజ్జుకా! (పాదములు తాకును)

చేటి—అయ్యా! వద్దండీ. ఇవి కాళ్లు. మీరుపట్టుకోవద్దు.

శాండి—(స్వగతము) అయ్యో! నామనస్సంతా చెదరిపోయిం ది. తలేదో కాళ్లేవో తెలుసుకోలేకుండా ఉన్నాను. తాటి పళ్లవలె బలిసి, అగరుపూతతో, గంధముపూతతో, పరి మళిస్తూ, వాలిపోకుండా నిక్కబొడుచుకొని ఉన్నవి, ఈ స్త నాలు. ఆహా! ఈపడుచు బతికి ఉండగా పట్టుకోలేకపో తిని! అభాగ్యుణ్ణి!

చేటి—(ఆత్మగతము) ఇట్లాచేస్తాను. (ప్రకాశము) అయ్యా! కొంచెముసేపు అజ్జుకను చూస్తూఉంటారా! ఇంతలో మా అమ్మను పిలుచుకొనివస్తాను.

శాండి—వెళ్లు శీఘ్రంగా, తల్లివచ్చేదాకా నేను తల్లికి మల్లే చూస్తూఉంటాను.

చేటి—(ఆత్మగతము) జాలిగలవాడీబ్రాహ్మడు, అజ్జుకను విడిచి పెట్టడు, పోయివస్తాను. (వెళ్లును).

శాండి—వెళ్లింది ఇది. ఇహ బాగా ఏడుస్తాను. హా! అజ్జుకా! హా! మధురగాయనీ! (ఏడ్చును)

పరి—శాండిల్యా! ఏడ్వరాదోయి!

శాండి—తొలగిపో! దయాదాక్షిణ్యాలు మాలినవాడా, నీవం టివాణ్ణే అనుకొన్నావా యేమిటి నన్నుకూడా ?

పరి—నాయనా! ఇటురావోయి: అధ్యయనము చేయుమోయి!

శాండి — అయ్యా! స్వాములవారూ! అయితే అధ్యయనంచేస్తే చికిత్సచేయవచ్చునా యేమిటి? ప్రాణంపోతున్న యీపడు చుకు; పాపము! దిక్కు లేకుండా ఉన్నది!

పరి — నీవు చదువునది ఔషధశాస్త్ర మనుకొంటివా యేమి?

శాండి — అయితే పాపమే నీయోగాభ్యాసానికి ఫలము.

పరి — (స్వగతము) అయ్యో! ఈతెలివిమాలినవాఁడు, కర్తవ్యాబోధ్యుఁ డగుటచేతఁ దన యాశ్రమస్థితిని, లోకప్రవాదమును గూడ గుర్తింపఁజాలకున్నాఁడు. మహేశ్వరాదులైన యోగాచార్యులచేత నించుక తెలిసికొంటిని. శిష్యుమీఁద దయచేతనగుసంగము బాధింపదు. కావున వీనికి యోగమనఁగా నిట్టిదని నమ్మకము పుట్టించుటకై యోగావిష్టుఁడనై ఈవేశ్య శరీరమున నాప్రాణములను బ్రవేశపెట్టుదును. (అట్లుచేయును)

గణి — (లేచి) శాండిల్యా! శాండిల్యా!

శాండి — (సంతోషముతో తనలో) ఆహాహా! ప్రాణాలు వచ్చినవి. బ్రతికింది ఈవేశ్య! (గణికతో) భవతీ! ఇదుగో ఉన్నాను. (అని తాఁకఁబోవును)

గణి — కాలుసేతులు కడిగికొనక నన్ను స్పృశింపకుము.

శాండి — అతిపవిత్రురాలుగా ఉంది ఈవేశ్య!

గణి — రా: నాయనా! అధ్యయనముచేయుము.

శాండి—ఇక్కడా అధ్యయనమేనా? అధ్యయనానికి మాస్వా
ములవారిదగ్గరకే పోతాను. (చేరఁబోయి) అయ్యో! స్వామి
లవారూ! అయ్యో! ప్రాణంపోయిందే స్వాములవారికి! హా!
వాచాల! హా! అతియోగదక్ష! హాహా! ఉపాధ్యాయ!
అయ్యో! సర్వమూ తెలిసినవారు; ఇటువంటివారుకూడా
మరణించడమేనా ?

(ప్రవేశించి తల్లియు చేటియు)

చేటి—రా అమ్మా! రా అమ్మా!

మాత—ఎక్కడనే నాబిడ్డ ఎక్కడనే ?

చేటి—ఇదుగో అజ్జుక ! పాముకరచింది చిగురుటాకులుకోయ
బోతేను:

మాత—అయ్యో! అయ్యో! నాకొంప కూలింది. నే చచ్చా
ను, అమ్మయ్యో!

చేటి—ఏడవకమ్మా! ఏడవకు! ఇదుగో అజ్జుకకు ఒళ్లు నిమ్మళిం
చింది. లేచికూర్చుంది.

మాత—అమ్మయ్యో! ఇదుగో (చేరఁబోయి) బిడ్డా! వసంతసే
నా ! ఏమి టమ్మా ఇది!

గణి—వృషలవృద్ధా! నన్నుస్పృశింపకుము, తొలఁగిపొమ్ము.

మాత—అయ్యో! ఇదేమిటే !

చేటి—విషం తల కెక్కినట్టుంది.

మాత—వెళ్లి దబ్బున వైద్యుణ్ణి పిలుచుకొని రా! పో! దబ్బున పో.

చేటి—అమ్మా అట్లాగే. (అరిగెను.)

(అంతట రామిళకుఁడు చేటి వచ్చుచున్నారు.)

చేటి—రండి బావా! రండి; మీరు కనపడకపోవడంచేత అజ్జుక అవస్థపడుతున్నది;

రామి—

గీ. కోరి నే నీవిశాలాక్షికులుకుఁబలుకు
మురిపములవిందు మొగమందు ముద్దుగొందు
నెలవిరిసినట్టి పొందమ్మివిరిని ముట్టి
వ్రాలి చుంబించుతుమ్మెదఁబోలి యిపుడు

(చేరఁబోయి) ఏమిది! నన్నుఁజూచి మొగముత్రిప్పికొన్నది! (పైఁటకొంగుపట్టుకొని)

గీ. తరఁగతాఁకున వ్రాలు నెత్తమ్మిఁబోలు
చున్నమోమింత యిటుద్రిప్ప సన్నతాంగి!
నించు ముద మించుకయుఁ దోఁచి నీమొగమ్ము
నలినలిగఁ ద్రాగు వాచాలునలిలమట్లు.

గణి—ఓయి అజ్ఞానుఁడా! విడువుమోయి నావస్త్రాంతమును.

రామి—భవతీ! ఏమిది?

చేటి—పాముకరచినతర్వాత ఇట్టాపిచ్చిమాటలు మాట్టాడు
తున్నదండీ!

రామి—అదే

గీ. స్పష్ట మిద్దాని చిత్తమ్ము సంచలించెఁ
జిత్తము చలింపఁగా నంతఁ జేతన చెడి
రిత్తయై తత్తరిల్లు శరీరమందు
జడుపుగొలిపినా రెవ్వరో సత్త్వయుతులు.

(వైద్యుఁడు, చేటి, ప్రవేశింతురు)

చేటి—రండి, రండి, అయ్యా!

వైద్యుఁడు—(ప్రవేశించి) ఎక్కడ ఆమనిషి?

చేటి—ఇదుగో అజ్జుక! ఏమో చాలా జబ్బుగా ఉన్నదండీ!

వైద్య—ముదురుతాచు బుస తగిలేటప్పటికి మనసు చెదిరిపో
యింది, ఆపైన అదికరచిందికూడాను.

చేటి—ఏమి టేమిటీ! అయ్యా! మీకెట్టా తెలిసింది.

వైద్య—ఎట్టా తెలిసిందా! కనపడడంలేదా! విషవికారము!
తీవ్రముగాఉంది! ఇట్టా తీసుకురా! నాచేతనయినంతవరకూ
విషతంత్రంలో అన్ని ఉపాయాలూ చేసి చూస్తాను.

(కూర్చుండి మండలము రచించి) కుండలకుటిలగామిణి!
మండలంపవిశ! పవిశ! వాసుకిపుత్తిర! తిట్ఠ! తిట్ఠ! స్వాహా! స్వాహా!
(ఊఁదును మంత్రించును,) సిరావేధ చేయవలెను; ఏదీ కత్తి?

గణి—మూర్ఖవైద్యుఁడా! అవస్థపడకు;

వై—ఆఁ! పైత్యంకూడాఉన్నది. నేను నీపైత్యాన్ని, వాతాన్ని, శ్లేష్మాన్ని, అన్నింటినీ నాశంచేస్తానుసుమా! ఏమనుకొన్నావో!

రామి—తగినమందు గట్టిగాఁ బ్రయోగింపుము తండ్రీ! నీమేలు మఱవము. తగినబహుమాన మొసఁగుదుము.

వై—సుందరగుళికుడని సర్పవైద్యుడున్నాడు. ఆతణ్ణి పిలుచుకొనివస్తాను. (వెళ్లును.)

(అంతట యమపురుషుఁడు ప్రవేశించును)

యమ—అయ్యో! యమధర్మరాజు నన్నుఁ బొడిపొడిచేసెను గదా!

గీ. ఈవసంతసేన యేఁ జెప్పినదిగాదు
శీఘ్ర మీమె మేనఁజేర్పు మోయి!
వేఱె యొకతె బ్రదుకుతీఱిన దున్నది
యీవసంతసేన నడిచితెమ్ము.

అని; దీనిశరీర మగ్నిసంస్కారముఁబడయక పూర్వమే కొనిపోయి యందు జీవమును బ్రవేశపెట్టవలెను. (చూచి) అన్నా! లేచియున్నదే యిది. ఇది కాదా!

గీ. దీనిప్రాణములు మదీయకరస్థము
లిదియు లేచి యిచట మొదలుచుండె

నెచ్చటేని యిట్టియచ్చెరియము భువి
యందుఁజూచి యెఱుఁగ మిందనుకను.

(అంతటను గలయఁజూచి) ఓహో! ఇదె యిక్కడ యోగియగు పరివ్రాజకుఁడు క్రీడించుచున్నాఁడు. ఇప్పుడేమి చేయుదును! కానీ! కనుఁగొంటిని. ఇట్లుచేయుదును. ఈగణిక జీవమును పరివ్రాజకశరీరమం దుంచిపోయి నాపని ముగిసినతర్వాత మరలవచ్చి యథాస్థానమునఁ బ్రవేశపెట్టుదును.

(అట్లు చేసి)

గీ. విప్రునిశరీరమందుఁ బ్రవేశపెట్టి
నాఁడ నే నాఁడుదానిప్రాణముల నిపుడు
తత్త్వమునకు శీలమునకుఁ దగినయట్లు
ప్రాయికమ్ముగా వికృతిని బడయఁగలవు.

(నిష్క్రమించును)

పరి—(లేచి)పరభృతికా! పరభృతికా!

శాండి—అమ్మయ్యో! స్వాములవారి ప్రాణాలు మళ్లీవచ్చినవి. నే ననుకొంటాను; కష్టాలనుభవించేవాళ్లు దబ్బునచావరు.

పరి—ఏడీ! ఏడీ! రామిళకయ్యా!

శాండి—స్వామీ! ఏమిటిది! కమండలముపట్టుకోదగిన మీ యెడమచెయ్యి ముత్యాలగాజులు మోస్తున్నదానికిమల్లే కనపడుతున్నది!

పరి—రామిళకయ్యా! నన్ను కౌగిలించుకోవూ!

శాండి—ఛీ! ఛీ! ఆమోదుగుచెట్టును కౌగిలించుకో.

పరి—రామిళకయ్యా! నాకేమో వికారంగా ఉందిగదా!

శాండి—కాదు కాదు, మదపిచ్చి యెత్తింది.

రామి—స్వామీ! ఆశ్రమ విరుద్ధమైన యాలాపము లాడుచుంటి రేల?

పరి—కల్లు తాగుతాను.

శాండి—విషం తాగు. (ఆలోచించి, తనలో) కానీ! ఇదేమో నవ్వులాటకథగా ఉన్నట్టులేదు చూస్తే. స్వాములవారు స్వాములవారుగా లేరు. అజ్జుక అజ్జుకగా లేదు. ఇదేమిటో భగవదజ్జుకముగా ఉన్నది! కానీ ఏమవుతుందో చూస్తాను.

పరి—పరభృతికా! నన్ను కౌగిలించుకోవూ!

చేటి—ఛా! పో! బాపనసన్నాసీ!

మాత—అమ్మా! కూతురా! వసంతసేనా!

పరి—అమ్మా! ఇదుగో నే నిక్కడున్నానే! దణ్ణమే !

మాత—స్వామీ! ఇదేమిటి?

పరి—కనుక్కోకుండా ఉన్నావు నన్ను; (రామిలకునిఁజూచి) రామిళకయ్యా! ఇవ్వేళ ఇంత ఆలస్యము చేశావేమి?

రామి—స్వామీ! అవశుఁడనై యున్నాను. నాకేమియుఁ దోఁచకున్నది.

శాండి—కానీ! చూస్తాను!

(వైద్యుఁడు ప్రవేశించును)

వైద్యుఁడు—ఎనిమిది గుళికలు తీసుకువచ్చాను. మంచిమందులు తీసుకువచ్చాను. బతికేదీ బతకనిదీ, అటయ్యేదీ ఇటయ్యేదీ నిమిషములో తేలుతుంది. నీళ్లేవీ? (చేరఁబోవును.)

చేటి—ఇవిగో నీళ్లు!

వై—గుళికను అరగదీస్తాను. ఓహోహో! ఈమెకు పాము కరవడమేకాదు. ఏదో ఆవేశించినట్టుగాకూడాఉంది.

గణి—మూర్ఖవైద్యుఁడా! వృథావృద్ధుఁడా! ప్రాణులకు నంతకుఁడ వగుటనుగూడ నరయఁజాలకున్నాఁడవు. ఈయాఁడు దాని నేజాతి సర్పము కఱచినదో యెఱిఁగితివేని చెప్పుము.

వై—చెప్పడంలో ఆశ్చర్య మేముంది?

గణి—శాస్త్రము కలదా?

వై—కావలసినంతఉంది. సవాలక్షగ్రంథం ఉంది.

గణి—ఏదీ చెప్పుము ఆవైద్యశాస్త్రమును.

వై—వినవమ్మా! చెప్పుతున్నాను. "వాతికాః పైత్తికాశ్చైవ శ్లై—ఇస్—అఁ! (పైకిఁజూచుచు నాలుక కఱచుకొని) పుస్తకము, పుస్తకము!

శాండి—(తనలో) బలేవైద్యుఁడు! తగినవైద్యుఁడు! ఒక్క ముక్క చెప్పాడో లేదో అంతలోనే మరపు అడ్డం వచ్చింది. నాకు పెద్దన్నయ్యల్లే ఉన్నాడు చూడగా; అయ్యో!! (ప్రకాశము) అయ్యా, ఇదుగో పుస్తకము!

వై—(పుస్తకముచూచి) ఐతేవిను, ఇదుగో వినిపిస్తున్నాను.

శ్లో. వాతికాః పైత్తికాశ్చైవ శ్లైష్మికాశ్చ మహావిషాః,
త్రీణి సర్పా భవంత్యేవ చతుర్థో నాధిగమ్యతే

గణి—అపశబ్దమయ్యా అది! 'త్రయస్సర్పా'అని చెప్పవలసి యుండఁగా, నీవు 'త్రీణిసర్పా' అనుచున్నాఁడవు. 'త్రీణి' అనునది నపుంసకలింగము. 'సర్పాః' అనునదిపుంలింగము. తప్పు శ్లోకము చదివితివి.

వై—అయ్యయ్యో! వైయాకరణసర్పమిప్పుడు నన్ను పీకిందే!

గణి—విషవేగము లెన్ని?

వై—విషవేగాలు వందలు.

గణి—కాదు, కాదు, విషవేగము లేడు.ఏవనఁగా!—

శ్లో. రోమాంచో ముఖశోషశ్చ వైవర్ణ్యం చాపి వేపథుః,
హిక్కా-శ్వాసశ్చ సమ్మోహ స్సప్తైతే విషవిక్రియాః.

ఈయేడు విషవేగములకంటె దాఁటినదాని నాశ్వినేయులు వచ్చినను జికిత్సింపజాలరు; అయినను నింకను నీవెఱ్ఱఁగినది, చెప్పవలసినది, యుండెనేని చెప్పుము.

వై—(స్వగతము) ఓరిబాబో!! మాకేమీ అందేటట్టులేదే చూస్తేను! (ప్రకాశము) అమ్మా! నీ కోదణ్ణం; పోయివస్తాను.
(వెళ్లును.)

(యమపురుషుఁడు ప్రవేశించి)

యమ—ఓహో!

మ. జ్వర గర్భస్రవ కర్ణశూల పిటక శ్వాసక్షయాక్షి వ్యధో,
దరగుల్మాది విశేషభీషణరుజాతంకమ్ముచే, నింక దు,
ర్భరసంక్షోభచయమ్ముచేత,బహుజీవవ్రాతముల్ నేనహ
ర్నిశమున్ చాలఁగ,నింతలో,యమపురద్వారమ్మునం ద్రోచితిన్.

ఇదిగో! మఱియు నేనింతలో స్వాములవారి యనుజ్ఞను పొందుదును.(వేశ్యను చేరఁబోయి)

స్వామీ! వృషలీశరీరమును విడువఁ గోరుచున్నాను.

గణి—అట్లే విడుచుచున్నాను.

యమ—వేశ్యాప్రాణములను యథాస్థానమునకు మార్చి నేనును నాపనిమీఁదఁ బోయెదను.

(అట్లుచేసి నిష్క్రమించును)

పరి—శాండిల్యా! శాండిల్యా!

శాండి—ఇదుగో! స్వాములవారు మామూలుస్థితికి వచ్చారు!

గణి—పరభృతికా! పరభృతికా!

చేటి—ఇదుగో! ఇప్పుడు అజ్జుక మామూలుమాదిరిగా పిలుస్తున్నది!

మాత—అమ్మా, వసంతసేనా! [తేలుకొన్నది!

శాండి—ఆహా, నా ప్రియురాలు వసంతసేన ఇపుడు తెప్పరిల్లి

(గణిక, రామిలకుఁడు, చేటికలు, తల్లి, వెళ్లుదురు)

శాండి—స్వామీ! ఏమిది!?

సరి—ఈకథ మిక్కిలి పెద్దది. మఠమున కరిగిన వెనుకఁ దెలి
పెదను. (దిక్కులుచూచి) అహస్సెల్లఁ గడచినది. ఇప్పుడు:

గీ. అస్తమిలుచుండె రవి యదే యపరదిశను
మూసఁ గ్రాఁగిన బంగారుముద్దవోలె;
తత్ప్రభలవెల్గుమేఘబృందములచే, న
భమ్ము దోఁచెడు నగ్నిగర్భమ్మువోలె.

(నిష్క్రమించిరి.)

గీ. జగతికెల్ల మేలు సమకూరుగా, కన్య
హితము భూతగణము వెతకుఁగాక!
తొలఁగిపోవుఁగాక దోషమ్ము లెందును
జనుల కెపుడు సుఖము జరుగుఁగాక!

ము గి సె ను

# త్వరలో వెలువడనున్న గ్రంథములు

## నా ట క ము లు

ప్రతిమ (భాసకృతికి దెనుఁగు)

మత్తవిలాసము, (మహేంద్ర విక్రమవర్మ కృతికి దెనుఁగు)
ప్రహసనము

సావిత్రి (క్రొత్త రచనము)

## ప ద్య కృ తు లు

దివ్యదర్శనము

విద్యార్థి

పెండ్లిముచ్చట

గృహలక్ష్మి

పూలతోట

## భాషాచరిత్ర గ్రంథములు

శృంగార శ్రీనాథము (ద్వితీయభాగము)

తెలుగు కవుల చరిత్ర

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర

ఆంధ్ర దేశ సంస్థానకవుల చరిత్ర